శ్రీ ర స్తు.

# రామశతకము

ఇది

భగవద్భక్తులకు పఠనోపయుక్తముగ

గుంటూరు తాలూకా అనంతవరప్పాడు అగ్రహార

నివాసస్తులగు

లేటు మూలుపూరి రామయ కవిగారిచే

రచియింపఁబడి

వారి దత్తకుమారుఁడగు

మూలుపూరి పున్నయ్యచే

ప్రచురింపబడినది.



బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

బి. కే. స్వామిచే

ముద్రింపఁబడినది.

1913.

వెల 0_2_0.



శ్రీరస్తు

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# — రామశతకము —

క॥ శ్రీరుచిరచరణరాజీవ
వారహరణలసదనంత వరిపురనిరంజా
శూరగుణౌఘాభరణా
శ్రీరఘువంశాబ్ధిసోమ సీతారామా. ౧

రవివంశాంబుధిసోమా
సవినయభక్తావనైక సదమలకామా
భవతిమిరచండధామా
శివహృదయనివాసనామ సీతారామా. ౨

దినరాజసదృశతేజా
ఘనరాజతనూజభక్తకల్పకభూజా
వినవే నాసురకరుణా
గనవే నన్నెల్లయెడలఁ గావవె రామా. 3

కమలాక్షకమలనాభా
కమలాహృదయాబ్జలోల కాంచనచేలా
కమలాసనాదివందిత
కమలహితకులాబ్ధిసోమ ఘనయశ రామా. ౫

సారంగధరనిభానన
సారంగధరాదిదేవ సన్నుతమాయా
సారంగాంతకత్రిభువన
కారణదుష్టాసురేంద్ర ఖండనరామా. ౬

నినుమనమునధ్యానింపుచు
ఘనులగునీభక్తవరులఁ గాంచుచునాపైఁ
గనికరమువచ్చుదాఁకను
దినములఁగడపెదను భక్తి దిరముగ రామా. ౭

జనకునియాజ్ఞందలనిడి
యనుజన్మున్ సతినిగూడి యరిగివనమునన్
మునిజనులఁగాచితివికృప
జనకునిక్రియ సర్వలోకజనకుఁడ రామా. ౮

వనచారివగుచువనమున
వనచారులతోడఁగూడి వనజాననకై
వనరాశిగట్టితివిబళి
వనజాతభవాదిదేవవందితనామా. ౯

అడవిని జానకి వెదకెడు
నెడఁ నలయుచు శబరియిడిన యెంగిలిపండుల్
గుడిచి తదబలారత్నముఁ
గడుకృపతోఁ గాచినట్టి ఘనుఁడవు రామా. ౯

క్రూరుని గాకాకారతఁ
జేరిన యపకారపరుని జెనటిదురాత్మున్
ఘోరాస్త్రంబునఁ జంపక
సారకృపం గాచినట్టి స్వామివి రామా. ౧౦

సృష్టిస్థితిలయములకై
స్రష్టృరమానాథ భార్గసంజ్ఞలచే వి
స్పష్టముగఁ ద్రివిధమూర్తుల
నిష్టముతో నున్న లోకహితుఁడవు రామా. ౧౧

శరణయ్యాయని వేడిన
తరి లంకారాజ్యమిచ్చెదనురమ్మని యా
సురవైరియనుజు నేలిన
చరితం బాశ్చర్యకరము చతురుఁడ రామా. ౧౨

వాలినొకసాయకంబునఁ
గూలిచి సూర్యాత్మజునకుఁ గోరిక దీరన్
వాలియధికారమంతయు
మేలుగఁ బొందించినావు మిత్రత రామా. ౧౩

వరదా ననుగాచుటనీ
కరుదా శరణాగతులను నతిదయతోడన్
బరిరక్షించెదవనవిని
నెరనమ్మితినన్నుఁగావు నిజముగ రామా. ౧౪

గుణరత్నములకునిధివగు
ఫణిశయనా నీగుణములు బ్రహ్మాదిసురల్
గణుతింపఁజాలరనుచో
గుణహీనుఁడ నాకునెన్నఁ గొలఁదియె రామా. ౧౫

ఖరదూషణాదిరాక్షస
వరుల న్నొకక్షణములోన వధియించుటచేఁ
బరమాత్ముఁడవనితలఁపక
నరపతివని నిన్ను నెట్లు నమ్ముదు రామా. ౧౬

ఖండితరక్షక హారకో
దండవిఖండన సురేశ దానవవైరీ
చండాంశువంశజాతప్ర
చండభుజాటోప దుష్టశాసన రామా. ౧౭

పరులధనంబులమీఁదను
బరభామలమీఁద నాసపడియెడివానిన్
హరిసుతుఁడు పెక్కుబాధలఁ
జెరఁబెట్టునటంచు నిన్నుఁజేరితి రామా. ౧౮

రోగమను భుజగమెపుడో
వేగంబున నన్నుఁబట్టి విదళించినచో
సాగునె నీనుతియిపు డను
రాగముతోఁ దలఁతునిన్ను రాఘవరామా. ౧౯

అన్నిటఁగలవనియార్యులు
నిన్నన్నఁగ నిజమటంచు నెరనమ్మితినీ
వున్నయెడ నాకుఁగనఁబడ
కున్నదిఘ్మమయ్యె యెచటనుందువురామా. ౨౦

రక్షకులు లేరు నాకిట
రక్షింపగననుచు ద్రుపదరాజాత్మజనిన్
రక్షకునిఁగాఁగ వేడిన
నక్షయముగ వలువలీవె యచ్యుతరామా. ౨౧

ఏరీనీసరిదైవము
లేరీననుఁబ్రోచువారలిలనీకంటె
న్నేరీతిచేతువో యను
రారీ నాతోఁడజెప్పుమా రఘురామా. ౨౨

వింటిని నీమృదుచరితము
గంటిని నీభక్తవరులఁ గడువేడుకతో
నుంటిని రక్షించెదవని
కంటకరాక్షసవిరామ కావవె రామా. ౨౩

భూపాలనికరమకుటా
భూపుత్రీచిత్తచోర పూరుషసింహా
నీపాదయుగముగొలిచెదఁ
గాపాడుము నన్ను నెపుడు ఘనయశ రామా. ౧౪

వారణదుఃఖనివారణ
ధారాధరమేచకాంగ దైత్యవిదారా
నీరాజసంబుచేన
న్నూరకపరిభూతుఁజేయు టొప్పునె రాఘవా. ౧౫

పక్షాపక్షంబులుని
స్వీక్షించిన లేవటండ్రు విబుధులుజనసం
రక్షార్థము సదయుఁడవై
యీక్షితిజన్మించినావు హితమతి రామా. ౧౬

ఎన్నఁడునిను నేఁజూతునొ
యెన్నఁడు నీతోడ మాటలేనాడెదనో
యెన్నఁడు ననురక్షింతువొ
యెన్నఁడునీపాదసేవ నిత్తువొ రామా. ౧౭

గౌతమమునిశాపంబున
వాతాతపవర్షములకు వగచుచునడవిన్
నీ తెరువుచూచుచుండెడి
రాతిని స్త్రీఁజేసినావు రఘుకులరామా. ౧౮

శరనిధికన్యావల్లభ
కరుణారసపూర్ణ లోకకారణ నేనీ
చరణంబులెగతియంటిని
గరిగాచినరీతినన్నుఁ గావవె రామా. ౨౯

పండుటసర్పముపైనట
యుండుట శాశ్వతముగాఁ బయోనిధినటనీ
కండజము వాహనంబట
దండిదొరేవునీవు నాకుదక్కితి రామా. ౩౦

జపములతపములవ్రతముల
నిపుణత్వము లేమి యెఱుఁగనేరను ననునీ
కృపతోడనురక్షింపుము
చపలుని విడనాడకయ్య సదయుఁడ రామా. ౩౧

కాంతలసౌందర్యంబుల
వింతలుగని భ్రమలఁజెందు వెడఁగునునన్నున్
బంతముమాని ముఖాంబుజ
కాంతులు వెసఁజూపి కరుణఁగావుము రామా. ౩౨

మానినులమోవిపానక
మాని లసత్సూప సంయుతాన్నముఘృతమున్
మేనుబ్బమెక్కి మదమున
నీనామామృతము ద్రావనేరరు రామా. 33

సురలందు గోవులందును
ధరణీసురులందు మఱి సధర్ములయందున్
నెఱి సత్యవాక్యులందును
స్థిరముగ నీవుందువనుట సిద్ధము రామా. 3౪

పరునాలిఁ గవయఁగోరుట
సిరి లేదని నీచమతుల సేవించుట ని
ష్ఠురభావంబునఁదిరుగుట
యరయఁగ దుర్గతికిఁ బ్రాప్తులగుట కే రామా. 3౫

ధర్మాధర్మము లెఱుఁగని
దుర్మతుల నెకాచినావు దొరతనమున నా
కర్మము లెట్టివియైనను
నిర్మలమతినన్నుఁగావు నిరతము రామా. 3౬

నీనామరసముఁద్రావెద
నీనామరసంబు శిరమునిండఁ జిలికెదన్
నీనామమునుతియించెద
నీనామముహృదయమందు నిల్పెద రామా. 3౭

ఆసించినాడ నీప్రియ
దాసావళిలోన నొక్క దాసుఁడ జడుఁడ
న్నాసవిడ లేనికష్టుఁడ
దాసావన కావవయ్య దశరథి రామా. 3౮

అందముగనీదుపదముల
నందెలుగజ్జెలున్మ్రోయ నానందముతోఁ
జిందులుద్రొక్కుచుదశరథ
సుందరికడ నాడుటెల్ల చోద్యమురామా. ౩౯

జనయిత్రి కోసలాత్మజ
జనకుఁడు దశరథుఁడటంచు జనులునుతింపన్
దనయుఁడవై జన్మించుట
దనుజాధిపకోటికిఁగాదె దశరథరామా. ౪౦

భవలతలుద్రుంపదాత్రము
భవవారిధిదాటనావ భావింపగనీ
ప్రవిమలనామముజనులకు
భవసన్నుతనామ పతితపావనరామా. ౪౧

శంకరుచాపముచేతం
బొంకముగనుబట్టివిఱిచి పుడమిసుతన్మీ
నాంకశరసదృశగాత్రిని
గొంకకచేకొన్నరాజ కుంజరరామా. ౪౨

రాముఁడను నేనుగలుగఁగ
రాముఁడు మఱియొకఁడుగలుగరాదని గర్వ
స్థేముఁడయి పల్కుభార్గవ
రాముఁబరాజితునిఁజేసిరావేరామా. ౪౩

కోతులువారిధిఁగట్టుట
కోతులచే నసురవరులు గూలుట సవా
కోతులసన్మానించుట
శ్రీతరుణీనాయకా విచిత్రమురామా. ౪౪

రారాపరమదయాకర
రారాదుష్కృతవిదూర రాజీవాక్షా
రారారఘుకులదీపక
రారాభక్తార్తిహరణ రారారామా. ౪౫

జగములు నీలోనుండును
జగములలోనుండువీవు జగదీశ్వరయా
జగదాదిసర్వవస్తువు
లగణితయశ నీవెకావె యచ్యుతరామా. ౪౬

ఎవ్వఁడుసర్వమునకుఁబతి
యెవ్వనిచేజగములన్ని యేర్పడునుగదా
నెవ్వనిచేనశియించును
నవ్వరదునిఁగొల్తునిన్ను నచ్యుతరామా. ౪౭

పుట్టితిగిట్టితిఁబూర్వము
గట్టిగబహువిధసమస్త కాయంబులనేఁ
బుట్టుటగిట్టుటమానెడి
పట్టుదొరికె నింకనేమి భయమురరామా. ౪౮

నీసతిసంపదలిచ్చుచు
నీసుతస్థాపనము సేయు నెమ్మిధరిత్రిన్
నీసుతుఁడాయు స్సొసఁగును
నీసరిదైవములుగలరె నిపుణుఁడె రామా. ౪౯

శూరుఁడనపారబలుఁడను
ధీరుఁడనని జనులుపొగడ దేవాఘప ని
స్సారబలురీతిఖలుఁడగు
చోరునిగోతివాలినేయ సుగుణమె రామా. ౫౦

రమ్యస్మరకేళిసలుపఁగ
సమ్మతినో రాజచంద్ర సరసుఁడవనినన్
నమ్మగున చెవులుముక్కును
దమ్మునిఁగోయుమనిపల్క ధర్మమె రామా. ౫౧

నీవెంతనిర్దయుండవొ
పావనచారిత్ర ధర్మపత్ని విదేహా
త్మావరజ నగ్నిఁబడుమని
భావంబునఁజింతలేక పనుపవె రామా. ౫౨

కోరితినా నీసంపద
మీరితినాయుష్మదాజ్ఞ మేలెఱుఁగక నే
దూరితినా నీదాసుల
నేరంబులు లేవుచూడ నిజముగ రామా. ౫౩

జనకాత్మజామనోహర
జనకజ నసురుఁడు గ్రహించి చనునప్పుడునే.
ననిచేసిపడితినిక్కడ
గనుము జటాయువననంగఁగావవెరామా. ౫౪

పాయవు త్రిభువనముల నెడఁ
బాయవు నినునమ్మియున్న భక్తుల నెపుడున్
బాయనికృప రావణద్వై
తేయానుజుఁగావ లేదె తిరముగ రామా. ౫౫

నీవే తల్లి వితండ్రివి
నీవే కాపాడునట్టి నేతవు మఱియున్
నీవే దాతవుహితుఁడవు
నీవే దేవుఁడవునాకు నిజముగ రామా. ౫౬

శరమొకటిచేతఁబూనిన
శరనిధిగర్వంబడంగి శరణనినిన్నా
దరణంబుచేసిమ్రొక్కడె
శరధిశయననిన్ను నెంచశక్యమెరామా. ౫౭

గాధేయుహృదయముననా
మోదముజనియింపనేగి ముదమునసుజనా
ద్బాధినియగు నాతాటకు
బాధించి యశంబుగనవె బలమునరామా. ౫౮

చక్కని నీదాశరీరము
మిక్కిలిశైలాదులున్న మేదినిమీదన్
బెక్కుదినంబులుదిరిగినఁ
జక్కను గదచూడ నిదివిచిత్రమురామా. ౫౯

కరివరుమొఱ గొబ్బునవిని
యరిభీకరసాధనంబు నంపి మొసలిఁ జె
చ్చెరఁజంపి కుంజరేంద్రుని
గరమరుదుగఁగాచినట్టి ఘనుఁడవురామా. ౬౦

కాంచనమృగమదె తెమ్మని
కాంచనగంధియగుసీత కాంక్షించినన
క్కాంచనమృగమగుదనుజువ
ధించితి నృకసాయకమున ధీరతరామా. ౬౧

వందనము సుజనమిత్రా
వందనమంభోజనేత్ర వారిజగాత్రా
వందనమమలచరిత్రా
వందనమరిభీమదేవ వందితరామా. ౬౨

ధ్రువుని గజేంద్రుఁగుచేలుని
రవిసూను నహల్య నసురరాజతనయునిన్
బ్రవిమలకృపతోఁగాచితి
వవురా నీమహిమ నెంచనలవియెరామా. ౬౩

ఎక్కడిసంసారంబులు
ఎక్కడిభార్యాకుమారు లెక్కడిబంధుల్
నిక్కముగ నిన్ను నమ్మితిఁ
జిక్కులఁబెట్టకిఁకఁ బ్రోవు సీతారామా. ౬౪

నీనామమమృతసారము
నీనామముమధురఫలము నిత్యసుఖదమున్
నీనామమహిమ దెలియఁగ
నేమనుజుఁడ నెంతవాఁడ నిత్యుఁడ రామా. ౬౫

తొలిచదువులపహరించిన
ఖలుసోమకుఁజంపి మఱలఁగమలభవునకున్
జెలువుగ వేదములొసఁగిన
జలచరరూపుఁడవునీవె చతురుఁడ రామా. ౬౬

మందరముజలధిమునిఁగిన
బృందారకులెల్ల మిగుల భీతిల్లంగా
నందంబగుకమఠాకృతి
మందరనగమెత్తినట్టి మాధవరామా. ౬౭

దితిపుత్రుఁడతులబలుఁడై
క్షితిని రసాతలముచేర్ప క్షేమముగాభూ
సతినుద్ధరించియార్య
స్తుతిఁగైకొన్నట్టి సవనసూకరరామా. ౬౮

సురలానందము నొందఁగ
నరమృగరూపంబు దాల్చి నరభోజనునిన్
దరిమార్చి యసురబాలుని
స్థిరముగ రక్షించినావు శ్రీరఘురామా. ౧౯

కామించి బలిసభాస్థలి
భూమిపదత్రయము వేడి పురుహూతునకున్
క్షేమంబులు గలిగించిన
వామనరూపుఁడవు నీవె వరదుఁడ రామా. ౨౦

క్షత్రియరుధిరంబులచేఁ
బైతృకతర్పణ మొనర్చి పరమప్రీతిన్
ధాత్రికి ధాత్రీసురులను
బాత్రులఁగాఁ జేయు వేదపారగ రామా. ౨౧

దశరథరాజపుత్రుఁడవై
దశదిశలు నుతింప జలధి దాఁటి యసురుఁడౌ
దశకంఠుఁ దునిమి సీతను
శశిముఖిఁ జేకొన్న రాజచంద్రుఁడ రామా. ౨౨

ఇలభారముడుప యాదవ
కులమునఁ దగఁ నుద్భవించి గురుశౌర్యమునన్
ఖలుల మదంబడఁగించిన
బలకృష్ణులు నీవె కావె భవహర రామా. 23

కలికాలాంతంబునభువి
ఖలుల సదాచారహీనకర్ముల నెల్లన్
బొలియించి ధర్మపద్ధతిఁ
గలుషంబులుబాపునట్టి కలికివి రామా. ౭౪

పురహరుఁడు త్రిపురవాసులఁ
బరిమార్పఁదలంచినపుడు పరమప్రేమన్
బురహరునకు బాణమవై
పురవాసులఁజంపినట్టి ప్రోడవు రామా. ౭౫

వినుమా నావిన్నపముల
ననుమానముమాని ప్రోతుననుమా ఘనమా
వనమాలిపలుకకుండుట
జననాధపితామహాదిసన్నుత రామా. ౭౬

అలవైకుంఠముభద్రా
చలముగనంగీకరించి సదయాత్ముఁడవై
యిలభక్తవరులఁ బ్రోవను
వెలసితివిగదయ్య వేదవేద్యుఁడ రామా. ౭౭

చేరువలేవ్రేపలుకవు
దూరంబున కేగినావొ దొంగతనంబో
భారంబోమాటలాడుట
శ్రీరమణీచిత్తచోర శ్రీరఘురామా. ౭౮

పాపుఁడను బాపకర్ముఁడఁ
బాపాత్ముఁడఁ బాపమతిని భక్తివిముఖుఁడన్
బాపంబులెల్లఁ బాపఁగ
నోపెదవని నమ్మినాఁడనో శ్రీరామా. ౨౯

తలఁచినరక్షింతువట
తలఁపనివారలను గావఁదలఁపవట కటా
తలఁపఁగ నేరనినన్నున్
ఖలునెట్టివిధాననైనఁ గావుము రామా. ౩౦

కాయము నిత్యంబనుచును
మాయనిసంసారమునకు మాల్పడితరుణో
పాయంబుగానకిటు చెడి
పోయెడి నెట్టులనుజూచి పొగిలెద రామా. ౩౧

ఏటిదరిమ్రానుబడుక్రియఁ
పాటవము నశించి మేను పడుటలుఁగిక పో
రాటములఁ బరులక ప్రకృతి
చేటున కేచేతురెవ్వరు చెనఁటులు రామా. ౩౨

తనవారి నమ్మియుండినఁ
దనవారలుచూడదండధరుఁ డదయుండై
తనదేహంబెడఁ బాపినఁ
దనవారెవరైన రారు తనతో రామా. ౩౩

ధరదానమియ్య బలినే
మొరలిడి మెప్పింపఁగరినె మోదముతో నా
దరణంబుసేయ శబరినె
నరుఁడ ననాథుఁడ ననాథనాథుఁడ రామా. ౧౪

తనయుఁడు మృతినొందఁగ నా
తనయుని బ్రతికింపనీకుఁ దగునని యార్తి
ధ్వని సేయు బ్రాహ్మణోత్తము
తనయుఁ బునర్జీవిఁగాఁగఁ దలఁపవె రామా. ౧౫

ఖగరాడ్వాహన కేశవ
నగజాహృదయాబ్జవాస నళినదళాక్షా
నగధర మాధవ నిర్జర
నగధీరా నిన్నుఁ గొల్తు నయముగ రామా. ౧౬

భవదీయంబులు బహువిధ
భవరోగవినాశమునకుఁ బరమౌషధముల్
దివిజమునిసేవితంబులు
నవ్రుపదముల నమ్మినాఁడ ననయము రామా. ౧౭

ధరోత్తమ నీ సుకథా
సారంబులు దెలియనట్టి జడమతి నిదురా
చారుఁడను గావు నీపద
సారసముల భక్తి నిచ్చి చక్కఁగ రామా. ౧౮

సుందరమై బ్రహ్మోద్భవ
మందిరమై యొప్పుచాల మానితమై కాం
తిం దగునీనాభ్యబ్జము
బొందుగఁ బూజింతుఁ బొన్నపువ్వుల రామా. ౮౯

భువనములు గిరులు నదులును
దివిబ్రహ్మేంద్రాది సర్వదేవగణములున్
నివసింపనాలయంబగు
భవదుదరముఁ బ్రస్తుతింతు భవహర రామా.

సిరికినివాసంబై భా
సురమై బహుభూషణాది శోభితమై సుం
దరమై విశాలమగునీ
యురమును బూజింతు భక్తియుతమతి రామా. ౯౧

ఆహవమున దశకంఠుని
సాహసమున సంహరించి సత్పురుషులకు
త్సాహము గలిగించిననీ
బాహుయుగము మదినిదలఁతుఁ బాయక రామా. ౯౨

మెల్లని నవ్వులునవ్వుచుఁ
జల్లఁగఁ గరుణార్ద్రదృష్టి సాగించుచు రా
జిల్లెడునీముఖపద్మము
మల్లెవిరులఁ బూజసేతు మఱువక రామా. ౯౩

సంపెంగవిరులజాజుల
నింపగుచేమంతిపూల నెంతయుభక్తిన్
సొంపగుతమ్ములనుబ్రకా
శింపఁగనీశిరముపూజసేతునురామా. ౯౪

బాలుఁడనై కొన్నాళ్ళును
స్త్రీలోలతఁగొన్నినాళ్ళు చింతింపకనిన్
గాలమునూరకపుచ్చితిఁ
గాలునిదండనము లెట్లు కడతునొ రామా. ౯౫

చక్కనిమార్గము తెలియక
చిక్కనఁబడితుదకునిన్నుఁ జింతించితి నన్
జక్కనిమార్గమునందిడి
చిక్కడలింపంగనీకుఁ జెల్లదెరామా.

కావవెననెల్లప్పుడు
ప్రోవవెనీపుత్రకులను బ్రోచినరీతిన్
నావలనితప్పులెన్నక
సేవకుఁడను భక్తిపరుఁడ శ్రీవరరామా. ౯౭

సామజనాయకవరదా
కామపితా శేషశాయి ఖగరాడ్వాహా
కామితదాయకజగదభి
రామానతకాంతిసోమ రాఘవరామా. ౯౮

పరమేశ్వర పరమాత్మక
పరమపురుష వాసుదేవ భక్తార్తిహరా
పరమపదవాస కేశవ
వరదా దయజూడు దీనవత్సల రామా. ౯౯

ఆపదలం బొందనీయక
పాపంబులఁ బారఁదోలి పరికింపుమున
నో పరమపురుష యీశ్వర
నీపదముల నమ్మినాఁడ నిరతము రామా. ౧౦౦

ఓ దేవదేవ రక్షక
నీదాసుఁడ దీనజనుఁడ నేరనివాఁడన్
శ్రీదేవీవర యేటికి
రాదే నామీఁదఁ గరుణ రాఘవ రామా. ౧౦౧

నమ్మితి రక్షించెదవని
సమ్మతమున నన్నుఁ గావు సరసిజనాభా
నమ్మినవానినిఁ జెఱుచుట
నెమ్మదినూహించి చూడ నీతియె రామా. ౧౦౨

ఆసించియున్న వానిని
దాసుని సద్భక్తియుతుని ధైర్యవిహీనున్
మోసము సేయందగునే
దాసావన కావవయ్య దశరథరామా. ౧౦౩

నీపాదభక్తి గలిగినఁ
బాపాత్ముండైనఁగాని పరముంగనఁగాఁ డే
కోపంబు మాని నాపరి
తాపము దొలఁగించి కావు దశరథరామా. ౧౧౪

జ్ఞానవిహీనుండను దు
ర్మానుఁడ దుష్టాత్మకుఁడను దురితపరుండన్
జ్ఞానాంగాసంగికమున
న్మానునిఁ గావించినన్ను మనుపుము రామా. ౧౧౫

శ్రీజానకీమనోహర
తేజోజితబాలసూర్య దీపితశౌర్యా
రాజీవసదృశనయనా
రాజాన్వయవనధిసోమ రాఘవరామా. ౧౧౬

శ్రీమత్పావననామా
క్షేమదయాధైర్యశౌర్యసీమా వనితా
కామారాక్షసవంశవి
రామా లోకాభిరామ రాఘవరామా. ౧౧౭

ఒప్పులుదప్పులు దెలియక
జెప్పితి శతకంబు దీనిఁ జేకొని నీవా
తప్పుల నొప్పులుగాఁ గను
మప్పా సత్కరుణతోడ నచ్యుతరామా. ౧౧౮

ఘనుఁడు చిదంబరనాముఁ
కునునెల్లమ్మకుఁ బ్రియాపుత్త్రుఁ డమరుఁడయిధరం
జను మూలపూరిరామయ
యనుకవి రచియించె దీనినచ్యుతరామా. ౧౦౯

సీ॥ శ్రీమద్భరద్వాజ నామసన్ముని గో
త్రంబున జన్మించితనరువాఁడు
మేరికపూడి లక్ష్మీనృసింహామాత్య
పుత్రరత్నంబునై పొదలువాఁడు
సీతమాంబాగర్భ సింధురాకానిశా
వనితాప్రభుండయి వఱలువాఁడు
సరసకవిత్వవిశారదహనుమత్క
వీంద్రానుజుండయి యెసఁగువాఁడు

రామకృష్ణకవీంద్రుండు ప్రేమగలిగి
మూలపూరికులాబ్ధి సంపూర్ణచంద్ర
రామసత్కవిరచితమౌ రామశతక
మునుమహాప్రౌఢముగఁ జేసె ముదముతోడ. ౧౧౦

రామశతకము సంపూర్ణము.